# భువనగిరి

## మార్కెటులో కార్మికులకు లైసెన్సు నిర్బంధము పనివారల ఆగ్రహము

(స్వ. వి.)

12 షహరేవరు 50 ఫ.

స్థానికగంజులో మార్కెటింగుకమేటి మొహతెమీంగారు కొన్నిదినములక్రింద, అమాలి, జల్లెడ, పాకీటొప్పువాండ్లకు సంవత్సరము ౧కి మనిషికి రు. ౧౪ లైసెన్సువుండవలయునని తీర్మానము చేసి, నిన్న ౧౧ షహరేవరునాడు అమాలి వాండ్లు జల్లెడవాండ్లు, పాకీటొప్పు స్త్రీలు లైసెన్సు తీసుకోవలయునని, లైసెన్సులేనివాండ్లు పనిచేయకూడదని మొహతెమీంగారు చెప్పటంవలన, పైపనివారు పనులుమానుకొని తమతమగృహములకు వెళ్ళిపోయిరి. వీటుకువచ్చిన బండ్లయొక్కమత్తు దిగుమతిలో వర్తకులకు ఇబ్బందులుకలిగినను ఆ రోజుమాత్రముగడిచెను. తెల్లవారి కొందరువర్తకులు తమతమ అమాలివాండ్లను బెదరించి లైసెన్సులుఖరీదుచేయించి పనులువడిపించుకొనుచున్నందున ఖరీదుచేయనిపనివాండ్లు ఖరీదుచేసినవాండ్లలో కలతలుజరిగెను. మొత్తముమీద మిగతపనివాండ్లు మాత్రము ఖరీదుచేయకతప్పదని లైసెన్సులుతీసుకొని వెళ్ళుదలచుకున్నట్లు తెలియుచున్నది.

### రైతుసహాయానికై పోయినవర్తకునికి మందలింపు

ఒక పర్వేపల్లిరైతు తనబండికి ఒకవైపున రొద్దును ఇంకొకవైపు గొడ్డుబఱ్ఱెనుకట్టి గంజులోకి వచ్చినందున గంజులోనుండు పోలీసువారు ఇద్దరు రైతును బండినుంచిక్రిందికిదించి నిర్బంధముచేయుచుండగా ఒక వర్తకుడు రైతులను ఇట్లు అక్రమముగా నిర్బంధముచేయకూడదని రైతువిడచిపేయుమనిఅన్నందున వర్తకుడగు గుప్తగారిని మందలించినట్లు తెలియుచున్నది

### మోటారుదెబ్బచే బాలునిమరణము

నిన్న సాయంత్రము ౬ గంటలకు కొన్ని మోటార్లు హైదరాబాదుకుపోవుచుండెను. అకస్మాత్తుగా ఒకమోటారు ఒకబాలునికి తగిలినందున వెంటనేఅతడు మరణించెను. శవపరీక్ష స్థానిక హాస్పిటలులో జరిగెను తెల్లవారిపూడ్చబడెను

### నీటికరువు

బావులలో నీరులేక ప్రజలు చాల ఇబ్బందిచేత బాధపడుచున్నారు. పశువులకు మేతలులేక దూరదూరగ్రామములనుండి రు. ౧కి ఒక వరిగడ్డిమోపుఖరీదుచేసి ఇంతవరదనుక మేపిరి కాని ముందు రూపాయిపావలాకు ఒక్కమోపుదొరకుటదుర్లభమైనందున ఆరైతులబాధ పశువులబాధ భగవంతుడెట్లుకడతేర్చునో తెలియకున్నది. చుట్టుపల్లెలలోగూడ ఇట్లేయున్నట్లు తెలియుచున్నది

# పాఠశాలకు గృహము కావలెను

ధర్మరావుపేట(తా॥ కామారెడ్డి) షహరేవరు౧౧:
(ఒకవిలేఖరి)

ఈగ్రామము కామారెడ్డితాలూకాకు ౧౦మైళ్ళదూరములో కలదు, ఇక్కడ ఒకప్రాథమికపాఠశాలగలదు. శ్రీమహమ్మద్ కాశిం ప్రధానోపాధ్యాయుడు వీరిచేతిక్రింద శ్రీమహమ్మద్ కాశిం శ్రీఎల్లయ్య సహకారఉపాధ్యాయులుగలరు ఒకచప్రాశికూడగలడు వీరుముగ్గురు ఉపాధ్యాయులు ఒకేసారిబదిలీఅయివచ్చి ఒకసంవత్సరమాయెను. వీరివేషభాషలు కడుయుక్తములైనవి వీరిప్రవర్తనమిక్కిలియోగ్యముగానున్నది మాపసిబాలుర కోమలహృదయముల రంజింపచేయుచు తాముఆర్జించుకొనిన జ్ఞానములను తమవ్యాపారమునకుతోడ్పడగల గ్రంథపరిశోధనలచే వనుత్కృష్టాభివృద్ధిచేసికొనుచు దినదినము అజ్ఞానులను సుజ్ఞానులుగాజేయుచున్నారు ఇపుడుబాలురసంఖ్య సుమారు ౭౦,౮౦ మట్టుకు పెరిగినది దినదినమువృద్ధికివచ్చుచున్నది ఇక్కడిపాఠశాలగృహముకు నెలఒకటికి ౩రూపాయిలు కిరాయిగలదు అయినమిక్కిలిఇరుకుగానున్నది గాలి ధార కముగారాజాలదు బడిచుట్టుపెంటకుప్పలుగలవు ఇందువలన ఆరోగ్యమునకు ఎదురుకనుపించుచున్నది ఇక్కడి పట్వారి వెంకటరాజా బాయసులకర్త వలిజాయిజా పండితు నరసింహ్మారావు వకీల్ కామారెడ్డిగారు పాఠశాలనిమిత్తంతమస్వంతం పట్టానుంచి ఒకఎకరముభూమి ఉచితార్థముగానిచ్చినారు ౩ మాసములక్రింద శ్రీమొతెమీంసాహెబు జిల్లా నిజామాబాదు మాగాము వచ్చియుండిరి వారుగృహనిమిత్తం సమీపంలో వంజారివచ్చునని చెప్పియుండిరి కానియింతమట్టుకు ఫలితముతేలలేదుకనుక శ్రీమొతెమీంసాహెబుగారు పాఠశాలగృహనిర్మాణము తొందరగాచేయించి మా బాలురకష్టములబాపి మమ్ములఆనందింపజేయగోరుచున్నాము. ఒకఉరుదుబాలికాపాఠశాలగలదు కాని మౌల్వీసంతులమ్మ సాహెబాగారు తగినగృహముదొరుకనందున చిక్కులుపడుచున్నారు.

### రోడ్డు కావలెను

ఈగ్రామము ౨మైళ్ళదూరములో హైద్రాబాదు నాగపూరురోడ్డు సజాశివనగరంజాగీరు బస్సుగేటువద్దగలియును కానిరోడ్డులేనందున రాకపోకలకు వర్తకమునకు చాలయిబ్బందిగానున్నది ఇంతేగాక వర్షాకాలములో బండ్లయొక్క రాకపోకలు బొత్తిగాఆగిపోవును ఇదివరలో శ్రీందు బ్వంతాలుకుదారుసాహెబుగారు మాగ్రామంకు దౌరావచ్చినప్పుడు ఒకసంవత్సరముక్రిందట దరఖాస్తుద్వారా మొరపెట్టుకొంటిమికాని ఫలితము తేలలేదు.

### కాలువ మరమ్మతు అవసరము

ఇచ్చటిజనసంఖ్య ౧౫౦౦ లోకల్ ఫండుమామూలు సంవత్సరమునకు౩౫౦] కొర్యుతూమదించవలె



# మనుపెద్దవాగు జలపాతము

(స్వ-వి)

మహబూబునగరుజిల్లాలో అమరాబాదుతాలూకాలో అమరాబాదుసమీపములో మనుపెద్దవాగు కృష్ణానదిలోకలియుచున్నది దానికిఎదుట శ్రీశైలమున్నది అట్టి మనుపెద్దవాగు పేరుకు వాగేఅయినను చాలాగొప్పవాగు. ఎండకాలములోగూడ దానిలో నీరుపారుచూ ఉండును. అంటే అదిజీవనదులలో దాఖలగుచున్నది. అట్టి వాగునకు కాలువతీసిన కొంతదూరములో ౬౦ అడుగులలోతుగల కనుమవచ్చును. అక్కడఆజలపాతముపడును. అంతటిఎత్తయినజలపాతం ప్రపంచంలోఇంతవరకులేదు. అచ్చట విద్యుత్తు సిద్ధముచేయవచ్చును, అవిద్యుత్తును మహబూబునగరంజిల్లాలో పూర్తిగా అన్నిగ్రామాలకుగూడా సప్లయిచేయవచ్చును. ఇప్పుడు హైద్రాబాదులో విద్యుత్తు ఎంతసిద్ధమగునో అంతకు మూడంతలవిద్యుత్తు అచ్చటసిద్ధమగును. హైద్రాబాదుప్రభుత్వమువారు పైజలపాతంవద్ద పరిశోధనలు చేయించుచున్నారు. ఈజలపాతం నిర్మాణమేఅయినట్లయిన మహబూబునగరుజిల్లా స్వరూపము గుర్తించనట్లుగా మారిపోవును-వ్యవసాయానికి బావులమోటలకు ఎద్దులను ఏటేట కొనవలెనంటే అవసరముండదు, గుడిసెగుడిసెలోగూడా గృహపరిశ్రమలు నడిపించవచ్చును మహబూబునగరుకూలీలు పొట్టచేతబట్టుకొని నూర్లకొలదిమైళ్లదూరం మట్టికూలికిగాను పోవవసరంలేదు తొందరగా ఈపనిని ప్రారంభింతురు గాక

---

సు- ఇక్కడఒకపురాతనచెర్వు గ్రామమునకు ౧౦౦ గజములదూరములోనున్నది ఈచెర్వుక్రింద సుమారు౩౦౦ ఎకరముల తరిసేద్యముఅవును ఈచెరువుకు ౩తూములుగలవు ౧అలుగుతూము ౧నడిమితూము ౩పక్కలతూము. పక్కలతూము చాలఎత్తుపైఉండుటవలన చెర్వులో సగముకన్న ఎక్కువనీళ్లుఉండగనె తూముపారుకం ఎత్తిపోవును ఈతూముపారుకం పైరుఅకుసకాలమునకు పారక రైతులు అనేకయిబ్బందులతో గూడలు ఏతములుపోసుకుంటు అనేకకష్టములకు గురిఅవుచున్నారు చేతగానివారు గూడలుపోయనిచో పైరులు ఎండిపోవును మరియు మాలుగుజారి తప్పదు ఇదివరలో ఆబుపాషితాలూక అఫీసరు కామారెడ్డిగారితో మొరపెట్టుకొంటిమికానిఇదివరకు ఏమిపరీక్షతేలలేదు, కాబట్టి జిల్లాఅధికారులైన తగినశ్రద్ధవహించి పక్కలతూముఒకగజముక్రిందికిదించినచో మాబీదరైతులకష్టములు తొలగును ఇదియునుగాక సాలుబస్సాలుగుత్తేదారులువచ్చి అలుగుదర్జులువకటి పైమన్ను పోసిపోతారు కానిచెరువుక్రిందికాలువలు మాబీదరైతులకుతప్పినవికావు కనుకప్రభుత్వంవారు చెర్వుక్రిందికాలువలు గుత్తేదారులతోతీయించి మాబీదరైతులకష్టములు బాపుదురుగాక,

# అపాయకరమైన మందులు

హైద్రాబాదు (దక్కన్)షహరేవరు ౧౫

హైద్రాబాదులోకొందరు గంధకం మనిశిల మున్నగు అపాయకరమగు ద్రవ్యలను వాడుటలో అశ్రద్ధచేయుటచే అపాయాలుకలుగుచున్నవని ప్రభుత్వమువారికి తెలిసింది. అందుచేత అట్టివారందరును ౩౦ షహరేవరు ౧౩౫౦ లోగా తమవద్దఉండినపైఅపాయద్రవ్యాలను పూర్తిగా దగ్గరిపోలీసుస్టేషనులో ఇచ్చివేయవలెను ఇకముందు ఎవ్వరున్నూ లైసెన్సులేనిది అట్టివుంచుకొనరాదు. ఉంచుకుంటే ౫ ఏండ్లవరకు జైలుశిక్షను అనుభవించవలెను,



యుద్ధానికిముందు విరోధిదేశమునుండి కొ[illegible]బడినది.

# సాత్వికపూజ జయప్రదముగా జరుపుట

(ఒకవిలేఖరి) తిరుమలగిరి, జూలై౧౮:

ప్రతిసంవత్సరముజరుగు మహంకాళిపండుగకు దున్నపోతులు, మేకలుకోయుట, ఆచారముగా జేయుచుండెను. కానికొన్ని సంవత్సరములనుండి స్థానికప్రజానాయకులు నిషేధించుటకై పాటుపడుచుండిరి దానిఫలితముగా గత౫సంవత్సరముల క్రిందటనే వైశ్యయువజనసంఘమువారును మార్వాడీసోదరులును యెక్కువగా శ్రద్ధవహించి హింసనుమాన్పించి సాత్వికపూజలు చేయించుచుండిరి గతసంవత్సరము కొందరుపూర్వాచారులు గుమిగూడి అనాదిగావచ్చుఆచారమును అపుటపాడిగాదని దేవాలయములో పూజారి గాపనిచేయుచున్న సీతారామయ్యగారిని ముందుసతోసి తమకత్తినపూర్తిచేసుకొనుటకు హింసనుచేయించి సంఘసేవకులమనస్సులను నొప్పించిరి అందువలన యీసంవత్సరముయెవ్వరును ఆగుడియొక్కపూజాదికములు జరుగవలెననుతలంపే తలపెట్టక మౌనమువహించియుండిరి. ఆగుడియొక్కపూజారిహింసజేయువారికి అనుకూలుడై స్వతంత్రముగా దేవాలయములో పూజలుజరిపించుటకైపూనుకొని సర్వప్రయత్నములతోయుండెను. యింతలో అమ్మవారిపండుగనాడు తలవనితలంపుగా జీవదయాప్రచారకసంఘముతరపున కృష్ణస్వామినాయుడుగారు ప్రచారార్థమై యేతెంచినపుడు యిక్కడివిషయములుకనుగొని ప్రత్యేకశ్రద్ధవహించి హింసనుమాన్పించుటకై వైశ్యయువజనసంఘాధ్యక్షులగు మంచికంటి వీరయ్యగుప్తగారిని, కరికితోడుగాయుండి పనజేయుచుండిరి. పెద్దరామయ్యగుప్తగారిని, బ్రాహ్మణుటూరి చంద్రయ్యగారిని, మార్వాడిమండలితరపున ఛగ్‌రాజాముగు వారినందరినిపురికొల్పి హింసనుమాన్పించి సాత్వికపూజలు యథాప్రకారముగా చేయించిరి.

# మాదిరెదక్కన్ విద్యానిధి

హైద్రాబాదు (దక్కన్), షహరేవరు ౧౩

మాదిరెదక్కన్ స్మారకంగా విద్యార్థులకు తనాలిమ్పుటకు ౨౦ లక్షలరూపాయీలు ప్రభుత్వమువారొకనిధిగా ఏర్పాటుచేసియుండిరి దానివడ్డినుండి ఏటేటఅర్హులైన విద్యార్థులకు ద్రవ్యసహాయంచేయబడును ఈసహాయమునకు సంబంధమైన నియమాలను జరీదాలో ప్రభుత్వమువారు ప్రకటించియున్నారు.

ఈసహాయాన్ని నిర్వహించుటకు ముగ్గురితోకూడిన ఒకసమితియుండును ఈసహాయనిధినుండి నెలకు౫౦౦రూ॥ ఆదాయములభించును. దానినుండి కళాశాలవిద్యార్థులకు నెలకు౧౦రూ॥ విద్యాశాఖద్వారా ౩౫౦రూ॥ను వృత్తివిద్యకు నెలకు౫౦రూ॥ను ఇయ్యబడును. కాలేజీవిద్యార్థులకు నెలకు౧౦రూ॥ హైస్కూలువారికి ౭రూ॥ లోయర్ సెకండరీవారికి ౫రూ॥ ప్రైమరీవారికి ౩రూ॥ యీప్రకారంగా అర్హులగువారికియ్యబడును.

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర ఆషాడ బ॥ ౩౦

గురువారము

## మన ప్రధానమంత్రి

హైద్రాబాదు రాష్ట్రి మంత్రి సభాధ్యక్షులైన(సదరెఅజం) రైట్ ఆనరబుల్ నవాబ్ సర్ హైదర్ నవాజ్జంగు బహద్దరుగారు హిందూస్థానములోని వైస్రాయిగారి క్యాబినెటులో ప్రకటనశాఖామంత్రిగా నియుక్తులైయున్నారు. మనప్రధానమంత్రిగారికి తగినగౌరవమే లభించినది. వైస్రాయిగారి కౌన్సిలుసభలో మంత్రియగుట అసాధారణమైన యంశము. దానిలో చేరుటకు మన ప్రధానమంత్రులకన్న అర్హులైనవారు మరొకరుండరు. బ్రిటిషిండియాకు ఈనియామకముచేత లాభమైతే హైద్రాబాదునకు నష్టమయ్యెను సర్ హైదరీగారిని మన రాష్ట్రములో మన ప్రధానమంత్రిగా ఉండినప్పుడు పొగడుట స్తుతిపాఠమనిపించుకొనును. ఇప్పుడు ఉన్నదున్నంతగా వచించుట శ్లాఘవలో చేరనేరదు.

శ్రీవారు హైద్రాబాదు రాష్ట్రములో సుమారు ౩౫ సంవత్సరములు ఉద్యోగమును నిర్వహించిరి. ఆర్థికమంత్రిగా అనేకసంవత్సరాలు పనిచేసిరి. ప్రధాన మంత్రిగా బహుసంవత్సరాలనుండి పనిచేయుచు వచ్చినారు. శ్రీవారి ఉపజ్ఞా బలముచేతనే ఉస్మానియా విశ్వవిద్యాపీఠము అస్తిత్వములోనికి వచ్చెను. ఈసృష్టి హైద్రాబాదు చరిత్రలో అపూర్వమైన ఘట్టమనిపించుకొనును. దీని మూలాన ఉర్దూకు భారతీయ భాషలలో అగ్రస్థానము లభించెను. ఉర్దూభాష వృద్ధిపొందినట్లుగా మరేదేశీభాషకూడా వృద్ధిపొందజాలదయ్యెను. విద్యావ్యాపకము కూడా దీనిమూలాన కొంతవరకు ఎక్కువయ్యెను. భారతదేశమంతటను, దేశీయ సంస్థానాలందంతటను ఇంగ్లీషు భాషయే ప్రధానబోధక భాషగా నుండగా మన హైదరీగారు ఒక దేశీభాషలోనే ప్రధాన బోధ జరుగునట్లుగా ఏర్పాటుచేసి మార్గదర్శకులైరి.

ఆర్థికమంత్రిగా నుండిన కాలమందేమి ప్రధానమంత్రిగా నుండిన కాలమందేమి హైద్రాబాదు ఆర్థికపరిస్థితులను మంచి పునాదులపై స్థాపించినది సర్ హైదరీగారే. యూరోపుమహాయుద్ధము యొక్క దెబ్బ మనరాష్ట్రముపైనను గట్టిగాపడెను. మనమిత్రులగు బ్రిటిషు వారికి విశ్వాసపాత్ర మిత్రులైన (యారెవఫాదార్) మన మహోన్నతవహించిన ప్రభువులుంగారుఉదారముగా సహాయముచేయుట ప్రథమధర్మమైయున్నది. వారావిధముగానే సహాయమునుచేసినారు. చేయుచున్నారు. అట్టిసహాయం మూలాన మన ఆర్థికపరిస్థితులకు కొంతదెబ్బ తగిలినను మన ప్రధానమంత్రిగారు గొప్పనేర్పుతో రాష్ట్రాభివృద్ధికవసరమగు కార్యములకేమిన్నీ లోపము కలిగించలేదు. పైగా ఇంకను ఎక్కువ ద్రవ్యము నేయిచ్చుచూవచ్చినారు. ఇదియేవీరిలోనుండు చాకచక్యము-

సర్ అక్బర్‌గారు మంచిమేధస్సంపన్నులు. అందుచేతనే రౌండుటేబిల్ సభలలోను మంత్రులసభలలోను ఫీరిదే ప్రాధాన్యత శ్రీవారు చాలా పరిశ్రమచేయునట్టివారు.

ఇట్టి ప్రధానమంత్రి మననుండి వేరగుటచేత రాష్ట్రవాసులందరికినిసంతాపము కలుగుచున్నది. ఇక వారి స్థానములో ఎవరువత్తురన్న ముచ్చట కొన్నాళ్లవరకు హైద్రాబాదు రాష్ట్రాన్నంతయు ఊడికించుచుండును. ఇట్టిసమయములలో మనరాష్ట్రములో ఏర్పడునంతటి వదంతులు మరెచ్చటను కానరావు. అప్పుడే ఒక వారము నుండి సర్ ఇస్మైల్‌గారు, సర్ యాఖూబ్‌గారు, అబ్దులజీజుగారు, తుదకు బహద్దరు యార్‌జంగుగారు, వదంతులలో ప్రధానమంత్రి పదవి పైకెక్కింపబడినారు. ఛత్తారీ నవాబుగా రిదివరకే నియమింపబడినారని రూఢియైన వార్తగా పత్రికలలో ప్రకటించుచున్నారు. అప్పుడే తంతీలు మ ఘ. వ. ప్రభువుగారికి పంపబడినవి. అప్పుడేకొన్ని పత్రికలలో అముకవ్యక్తి మాదృష్టిలోనే కాక ప్రజల దృష్టిలోను ఉత్తమోత్తముడు. అతన్నే ప్రధానమంత్రిగా చేయవలెను. అను ప్రచారముచేయ మొదలు పెట్టినారు. మాకు ముల్కీయేకావలెనని కొందరు పత్రికాప్రకటన చేయుచున్నారు. ఇటీవలనే ప్రభుత్వమువారు ఉద్యోగాలనియామకములో పత్రికలందు ప్రచారముచేయరాదని శాసించినారు. అందుచేత మేమేదియు సూచించనొల్లము. పైగా అట్టి సూచనలవలన కలిగే లాభమున్నూ కానరాదు. మ. ఘ. వ. నిజాంప్రభువుగారి దివ్యచిత్తము ప్రకారమేజరిగితీరును. శ్రీప్రభువులుంగారు అసాధారణ మేధస్సంపన్నులు. తమప్రజలకేదిలాభకరమో దానినివారు చేయువారు. కావున ప్రజలీ విషయములో అనవసరమగు ఆందోళనము ప్రకటించుట వ్యర్థప్రయత్నము.

అయితే ఒకనియమమును గురించి మాత్రమభిప్రాయమిత్తుము. సాధారణముగా క్రొత్తమంత్రి నియామకమగు వరకు మంత్రులలో సీనియర్ అయిన వారే ప్రధానమంత్రిపనిని చూచుకొనుచుందురు. ఈలెక్కప్రకారము నవాబ్ అఖీల్‌జంగు బహద్దరుగారు తాత్కాలిక ప్రధానమంత్రిగా నుండవచ్చును.

——

## మేతలు

వర్షాలు లేనందున పశువులకు మేతలులేవని తెలంగానాలోని అన్ని ప్రాంతాలనుండి వార్తలువచ్చినవి. పశువులకు మేతలేక నష్టమగుస్థితియేర్పడ్డదనియు రైతులకు చాలా ఇబ్బందికలుగుచున్నదనియు ప్రతి తెలంగానా ప్రాంతమునుండియు ప్రతిదినమును వార్తలువచ్చుచున్నవి. ఎన్నియోమారులు తెలంగానా రైతులకీ సంక్షుటనసంభవించినను తమపద్ధతులలో మార్పులను కావించుకొననొల్లరు. ఇప్పుడుపశువుల మేతలు కరువైన ఎవరేమిచేయగలరు? ఇట్టివార్తలను మరాట్వాడా ప్రాంతమునుండి మన మెంగుకు వినుటలేదు. రెండుసంవత్సరాలు వరుసగా కరువువచ్చినను మరాట్వాడాలో పశువులకు మేతలేదు. అవి చచ్చిపోవుచున్నవి. అనువార్తలను ఎవ్వరునువిననేరరు.

దీనికి మూలకారణ మేమనగా తెలంగానాభూములు గడ్డిపట్టుభూములు. ఆకాశంలో మేఘంకనబడి తేభూమి తేమ అయితే గడ్డి పెరుగుతూవచ్చును. పశువులు ఆగడ్డి పైకి రాకముందే భూమిని గూడా కొరుకుచూ మేయుచుండును. మరాట్వాడాలోని భూములు గడ్డిపట్టు భూములుకావు. పైగా రైతులుగడ్డి యేమిన్నీ లేనట్లుగా దున్ని వేయుచుందురు. వారు గడ్డివాములను పొట్టువాములను చొప్పవాములనువేరువేరుగా వేసినిలువయుంచుకొందురు. గొప్ప సేద్యగాండ్లు రెండేండ్లు మూడేండ్లు పనికివచ్చునట్లుగా వాములనిలువయుంచుకొందురు. తెలంగానారైతులు వాములను ఎందుకు వేసెరు. వారికిని గడ్డిసమృద్ధిగా పండును. రాగి, వరి, కొర్రగడ్డి, సమృద్ధి. పొట్టు అనగా ఉలవ, జొన్నకంకి, సెనగపొట్టు వేరుసెనగఆకు పుల్లలు, ఇట్టివాటిపొట్టు కూడాలభించును. పునాస రబ్బీజొన్న వేయుచుందురు. ఈ మూటిని వేరు వేరుగా ఎందుకు వాములు వేయరు? కంచెలలో ఉత్త గడ్డిపండుచుండును. ఆ సౌకర్యమున్నవారు దానినెందుకు నిలువయుంచరు. తెలంగానారైతులు గడ్డి పొట్టు చొప్ప వాములను వేసియుంచుకొను ఆచారాన్ని బాగాఏర్పాటు చేసుకొనవలెను. లేకుండిన చాలానష్టపడగలరు. పశువులను కట్టిమేపుటకూడా తెలంగానా రైతులలోలేదు. అందుచేతనే మరాట్వాడాపశువులెక్కువ బలిష్ఠముగానుండును. నెల్లూరు గుంటూరు ప్రాంతాలవారు ఆవులను పెంచి కోడెలను మన దేశములో అమ్మిపోదురు. ఈపని తెలంగానా రైతులుచేయవలసి యుండెను. పశునష్టములవలన వ్యసనపడుటకు మారుగా పశువుల అమ్మకమువలన లాభం పొందువారై యుందురు. ఈ విషయాన్నికూడా మనరైతు లశ్రద్ధచేసినారు. ప్రతిరైతుకూడా ఒకరెబదులు ఒక ఆవును పెంచి గ్రామమువారంతాకలసి ఒక విత్తనం కోడెనుకొని గ్రామములోని ఆవులను ఒకచోట మేపించినచో గ్రామ పశుసంపద వృద్ధియగును. రైతులకు లాభంకలుగును. తెలంగానా రైతులు తమ పౌరాణిక వ్యవసాయపద్ధతులలో మార్పులను తొందరగా చేసుకొందురు గాక.

——

## క్రైస్తవనాయకులు గాంధిమహాత్ముని దర్శించుట

పూర్వము బెంగాలు మంత్రిగానుండిన నలినీ రంజన సర్కారుగారు జూలై 18వతేది సాయంకాలము గాంధిమహాత్ముని దర్శించి భారతదేశములో ఇపుడేర్పడియున్న పరిస్థితిని, అందులో ముఖ్యముగా బెంగాలుకుకలిగియున్న బాధనుగూర్చి వారితో నాలోచించిరి

భారతీయ క్రైస్తవ సంఘాధ్యక్షుడగు డాక్టర్ రామచంద్రరావుగారును పూర్వము ఆసంఘమునకు అధ్యక్షుడగు ప్రొఫెసర్ హెచ్ సి ముఖర్జీగారును, వర్లీలా రాంగారునుకూడ గాంధిమహాత్ముని దర్శించి సాంఘిక వైషమ్య సమస్యనుగురించియు, అల్ప సంఖ్యాక సమస్యనుగురించియు చర్చించిరి

——

మ. ఘ. వ. ప్రభుత్వ ఆర్థిక శాఖవారి

## ప్రకటన

నెం. 9 — 3 మహాశేవర్ 1350 ఫ.

### 1351—61 ఫ. ప్రతిశతి 6 వడ్డీలో అప్పు

ఇందుమూలముగా తెలియజేయున దేమనగా 1330 ఫ. 19 ఆబాన్ నాటి నెం. 26 గల అసాధారణ జరీదాయందు ప్రకటింపబడిన ఆర్థికశాఖవారి 13 వ ప్రకటన యొక్క నియమములననుసరించి, మ. ఘ. వ. నిజాం ప్రభుత్వమువారి 1351--61 ఫ. బాపతు ప్రతిశతి 6 వడ్డీగల అప్పు పత్రపు దాఖలా విలువ 16 బహామన్ 1351 ఫ. నాడుగాని తరువాత గాని తిరిగి చెల్లించబడును.

ఇంకను తెలియజేయుట ఏమనగా, 15 బహామన్ 1351 ఫ. తేదినుండి, ఈ అప్పుపై వడ్డీ యివ్వబడదు. ప్రస్తుతము ప్రామిసరీనోట్లు గలవారలు వాటినిసక్రమముగా హైదరాబాదు సెంట్రలు ట్రెజరీలో దాఖలుచేసి అందుకు సంబంధించిన వడ్డీ అసల్లు 16 బహామన్ 1351 ఫ. నాడుగాని తదుపరిగాని పొందవలెను.

బల్దాయందుగాక యితర ప్రదేశములందు నివసించుచు ప్రాంసరినోట్లుగలవారి సౌకర్యార్థము, యీక్రిందిపద్ధతి ఏర్పాటుచేయబడినది. ఏతహసీలు సంబంధినను లేక జిల్లాఖజానా యందైనను ఆప్రామిసరీనోట్లను దాఖలుచేసినచో, ఆఖజానావారు వడ్డీనిచెల్లించి, పత్రముముట్టినట్లు రసీదునిచ్చి, దానిని పూర్తిగా చెల్లించుటకొరకై సెంట్రలు ట్రెజరీకిపంపెదరు. సెంట్రలు ట్రెజరీవారు అసలును,తహసీలు లేక జిల్లాఖజానావారు వడ్డీగూడా చెల్లించనిచో అట్టి వడ్డీని, ట్రాన్స్‌ఫర్ రసీదును పొంది, ఏఖర్చులులేకుండా, తత్సంబంధమగు తహసీలు లేక జిల్లా ఖజానాకు పైకముపంపెదరు. ఆయాఖజానాలవారు ప్రామిసరీనోట్లుగలవారికి, తాత్కాలికముగా యివ్వబడిన రసీదునువాపసుతీసుకొని, పైకముచెల్లింతురు.

ప్రామిసరీనోటును దాఖలుచేయునప్పుడు అది ఆఖరున ఎవరిస్వాధీనములో నున్నదోవారు ఆపత్రమువెనుక యీక్రిందివిధముగా వ్రాసి సంతకముచేయవలయును.

" మ. ఘ. వ, నిజాం ప్రభుత్వము వారినుండి
ఈ ప్రామిసరీనోటు బాపతు చెల్లించవలసిన
అసలు పొందనైనది. "

( ఆఖరుననోటు స్వాధీనములోయున్నవారి సంతకము. )

ప్రస్తుతము అప్పు పత్రములు గలవారు, తిరిగి వెంటనే పెట్టుబడి పెట్టుటకు తగినవసతులు లేనందున గలుగు నష్టమునుండి రక్షించుకొను వీలుగలుగజేయు దృష్టితో, మ. ఘ. వ. నిజాంప్రభుత్వ మువారు ఆర్థికశాఖవారి 10 ఖుర్దాద్ 1350 ఫ. నాటి నెం. 6 వ ప్రకటననుసరించి, క్రొత్తగా యివ్వబడుచున్న, 1360--70 ఫసలీలకు ప్రతిశతి 3 వడ్డీయివ్వబడు అప్పు పత్రములుగా మార్చుకొనుటకు అవకాశము యిచ్చుచున్నారు.

ఆర్థిక శాఖ కార్యదర్శికిగాను,

(సం) సి. బి. తారాపోర్‌వాలా.

## లంకపల్లి రైతుల మొఱ

వరంగల్ జిల్లా మధిరతాలూకాలోచేరిన లంకపల్లిగ్రామమున భగవత్కృపవలనైన తోగుకాలువ ఒకటియుండెను. అకాలువసంవత్సరము (౧౨ నెలలు) పారుచుండును. దానిని ఎక్కువజీవనది కాలువఅందురు. అకాలువ లంకపల్లిగ్రామమునకు ఉత్తరమునసుండు అడవిలో నీలాద్రిగుళ్లగుట్టనుండివచ్చి వాగు వృధాపోవుచుండ మాపూర్వులు దానికి అనకట్టకట్టి కాలువతీసి గుర్వాయిచెర్వుకు శికిస్తజర్యాలోనికితెచ్చి తరి, బాగాయతుసేద్యము చేయుచుండిరి కొంతకాలమైన తదుపరి ఫ ౧౩౦౪ సాలులో అనకట్ట రెండుచోటులతెగి శిథిలమాయెను అప్పటినుంగి సర్కారువారికిసేము మాలులో అప్పాషీలో దరఖాస్తులు ఇచ్చుకొంటిమి. కాని ౧౩౦౬ ఫసలీలో ఒకపర్యాయము కొల్చుకొనివెళ్ళిరి తిరిగి కాలువ అనకట్టవిషయమై ఆలోచించినవారు లేరైరి. పేదరైతులు ప్రతిసంవత్సరము తెగినరెండుచోట్లలో మట్టితో ౪౦-౫౦ మంది మనుష్యులు ౩-౪ రోజులు పోయటము సంభవించుచుండెను మట్టిఅనకట్టుఅగుటచే యేమాత్రము వర్షముకురిసినను వాగువచ్చి మట్టిఅనకట్టు తెగుచుండుటచేత సంవత్సరమునకు ౫-౬పర్యాయములు అనకట్టుపోయివలసి వచ్చుచుండెను ఇందువలన పంటలకు సకాలమున నీరుదొరకక కరిపేదమాదిరి పండుచుండెను. మేము స్వంతముగా కష్టపడి తెచ్చినసీటికి దయామయులగు సర్కారు ధారాబందోబస్తు యం ౧ కి ౧౦౪రులు తరీకిన్ని మరియు యం౧కి రు ౨౫౦ లు బాగాయతుకు వసూలుచేయుచుండిరి. ధారావిషయమైదరఖాస్తులు యిచ్చుకుంటిమి. విచారించిన ప్రభువులులేరైరి. ఏదిరొట్లున్నను దరఖాస్తులు ఇవ్వగా అప్పాషీ నాజింసాగారు తిరిగిమళ్ళి తోగుకాలువ కొల్తలుకొల్పించిరి, శ్యామరాజబహద్దురు సదరుల్‌మహాం నాజింసా॥ అప్పాషీగారు ఈ నాలేదారుసా॥గారు తోగుకాలువయున్న అనకట్టుకొల్చినదక్షాలు తనిక్చేసుకొనిరి. రాజాశ్యామరాజబహద్దురుగారు రు ౧౫౦౦౦లకు అనకట్ట మంజూరియిచ్చినారు. ౧౩౪౯నుండి మరమ్మతుకాగలదని సెలవిచ్చిరి. అంతపెద్దప్రభువులు సెలవిచ్చిన మరమ్మతుమంజూరి యింతవరకు లభించనందున రైతులు నిశ్చేష్టులైమండు మన ఋణములుతీరి జీవనోపాధికి దారియేదని చింతిల్లుచుండిరి. కొద్దివ్యయముతో ఎక్కువఆదాయము స్థిరమైనసేద్యము అయ్యేపనిని మరియుకష్టనష్టము అనుభవించుచుండు రైతులబాధలు తొలగగలందులకు యీసంవత్సరమైనను సర్కారువారు మాపేదరైతులయందు దయయుంచి లంకపల్లి తోగుకాలువ అనకట్టును మరమ్మతుచేయించగలందులకు సర్కారువారిని మిక్కిలి ప్రార్థించుచున్నాము. ప్రస్తుతము యం ౧౩౫౦ తరి యం ౪౨ బాగాయతు సేద్యము అగుచున్నది, మరమ్మతులయిన యింకా యం ౪౦౦ అవలీలగా సేద్యమగును.

ఇట్లు  
లంకపల్లిరైతులు,  
జగ్గవరపు వెంకట్రామారెడ్డి వగైరా



## వాడపల్లిలో ప్రయాణికుల యిబ్బందులు

వజీరాబాదు అను పేరుతో పిలువబడిన పట్టణమిపుడు వాడపల్లిఅనుపేరుతో నల్లగొండజిల్లా మిర్యాలగూడెం తాలూకాలో కృష్ణాతీరమునసున్నది. స్టేటురైల్వేబస్సు సర్వీసువారు యీగ్రామమునకు సాయంత్రము సుమారు౫గంటలకు బస్సువచ్చునట్లును, తిరిగి ఆదేబస్సును మరుసటిదినము ఉదయము ౭గంటలకు వెళ్ళునట్లును ఏర్పాటుచేసినారు. సదరుబస్సునకువెళ్లు మిటిమొయిలాకొనుండివచ్చు ప్రయాణీకులు రాత్రి వాడపల్లిలో పండుకొని ఉదయము వెళ్లవలసి వచ్చుచున్నది. వాడపల్లిగ్రామములో భోజనహోటల్లుగాని, ఫలహారముల అంగళ్ళుగాని, పండుకొనుటకు అనుకూలమైన వసతులుగానిలేవు. అనువారితోను, పిల్లలతోనువచ్చుప్రయాణీకులు చాలకష్టమునకులోనై దోలాయమనస్కులై ఎట్లో ఎక్కడో తలదాచుకొని బ్రతుకుజీవుడాయని తెల్లవారగనే తమప్రయాణమును సాగించుచున్నారు. ప్రయాణీకులకు తగినసౌకర్యములులేని కారణముచే అనేకమంది ఉపవాసములుగూడ చేయుచున్నారు అదేవిధముగా వాడపల్లికి సాయంకాలము బస్సుకు దిగినవారుగూడ అరాత్రి వాడపల్లిలో జాగరణఉపవాసములుజరిపి మరునాడు ఏటిని దాటుచున్నారు, స్టేటురైల్వేబస్సుసర్వీసువారు ప్రయాణికులకు గలుగు యీయిబ్బందులను గుర్తెరుగక బస్సుటైమును మార్చలేదు. అదృష్టవశాత్తు బస్సుయిపుడు సాయంత్రము ౩గంటలకు వాడపల్లిచేరి మరలవెంటనే ౩౪గంటలకు తిరిగి వెళ్ళుచున్నదనియు తెలియుచున్నది, ఎల్లప్పుడును యిదేటయిములో బస్సును నడిపించినయెడల మిటిమొయిలాకొనుండి వచ్చు ప్రయాణీకులకు రైల్వేబస్సు సర్వీసువారు చాలసౌకర్యములను కలుగజేసినవారగుదురు.

రెంటచింతల,  
గుంటూరు జిల్లా  
17-7-1941 } "యస్- కృష్ణమూర్తి"

## హరిజనుల పాఠశాల

తాలూకా కామారెడ్డిలోచేరిన కుపిర్యాలగ్రామంలో హరిజనులపాఠశాల బాగా నడుస్తున్నది. వీరికి కొన్ని భజనపాటలు భక్తిమార్గముగూడ చూపించవయినది.

## ఆయుర్వేదసహాయము

నల్లగొండజిల్లా రైతుల మొర

సుమారు మూరుమంది సంతకముచేసి మాకీట్లు వార్తపంపుచున్నారు:—

"వైద్యశాఖమంత్రిగారికి ప్రభుత్వంవారు ఆయుర్వేదానికి ౩౫ ౦౦రూపాయిల వ్యయమును అంగీకరించినారు. నూటికి ౯౫మందికి ఆయుర్వేదమే శరణ్యమగుటచే ఇదిచాలదు. అందుచేత ఇతరవైద్యాలకిచ్చినట్లుగా ఆయుర్వేదానికి ప్రతితాలూకా లోకల్‌ఫండునుండి ద్రవ్యసహాయం చేయించవలెనని ప్రార్థించుచున్నాము.

## సూతకములో దేవాలయ ప్రవేశము

వనపర్తి 12-10-50:

శ్రీచెన్నకేశవాలయంలో గోపలుపేట లో ఈఊరిగ్రామాశ్రితుడియింటిలో అతనితమ్ముడు రేకగర్భజనితుడు చనిపోయెను, కాలధర్మ మొందినవాడు దత్తుపోయియుండెను, గావున ఈ గ్రామాశ్రితునకు ధర్మశాస్త్రరీతిగా మూడురోజులుసూతకమువుండితీరుతుందని సనాతనులగు శాస్త్రజ్ఞులకు తెలిసినవిషయమే. యేరోజు అతనితమ్ముడు చనిపోయియుండెనో ఆరోజు స్నానముచేసి డాక్టరుగారిసహితముగా ప్రవేశించుటయేగాక అచ్చటనే లగ్నముగూడచేయించెను పూజారి వారించినను లెక్కపెట్టక ప్రవేశించెనట. స్వామివారి సంప్రోక్షణ జరుగలేదు కాని ఆరాధన అరగింపుతమాత్రము యథావిధిగాజరుగుచున్నదని తెలిసినది

## చందాదారులకు మనవి

చందాదారులు మా కార్యాలయమునకు జాబులు వ్రాయునపుడు, మనిఆర్డర్లు బంపునపుడు, తమ చందానెంబరు వ్రాయుటయందు తగుశ్రద్ధగైకొనుటలేదు. చందా నెంబరు వ్రాయనిది వెంటనే జవాబీయుటకు వలనుపడదు. కాన చందాదారులెల్ల ముఖ్యముగ గమనింపకోరెదము.

మేనేజరు, గోలకొండపత్రిక

## పెద్దెముల

లంబాడీల తిరుగుబాటు-పోలీసులచర్య

ఒక విలేఖరి) 13-10-50

గుల్బర్గాజిల్లాలోని ఈగ్రామానికి నాల్గుమైళ్లపైన అనంతపురం అడవిలో తేది 1-10-0నాడు రాత్రి అబ్కారి ఖుఫియు పార్టీ వాంద్రు లంబాడివాంద్రవద్దనుండి దొంగభట్టిసారాయి సామానువశపరుచుకొనియుండగా లంబాడీలు కొందరు 15 లేక 20 మంది ఆరాత్రి అకస్మాత్తుగా వారిపైబడికొట్టి వారిస్వాధీనములోనున్న సామానువశపరచుకొనిరట. తర్వాత పెద్దెములనుండి పోలీసుసహాయంకోరినందున పోలీసువారువెళ్లి నిందితులనుపట్టి వ్యవహారించేయుచున్నారు

పెద్దెములకు నాలుగు మైళ్ళపైన నాగులపల్లిగ్రామంలో అడవిశాఖవారు నిర్ణయించిన చౌకిదారుచాలసంవత్సరములనుండిఇక్కడవున్నాడు. రైతులకు మరియు గ్రామజనులకు చాలయిబ్బందులుపెట్టుచున్నాడు. చౌకిదారుగారు తనకొమారుని కేశఖండనం (పుట్టువెంట్రుకలు) నిశ్చయంచేసి చుట్టుగ్రామాలకు-విందుమాదిరిగా ఒకటికొండుకొబ్బెర్లుపంపించియుండిరి. కొందరికి వీలుకాకనో లేక మరేమికారణంవలననో వెళ్ళలేదు. వారివద్దికి తననౌకరునిపంపించి, యిస్తేరూపాయి యివ్వండి లేకపోతే యిచ్చినకొబ్బెర్లు వాపసుయివ్వండిఅని వసూల్‌చేసినారుఅని తెలియుచున్నది

## పద్మశాలి యువజనసంఘము

పోయిన జ్యేష్ఠ బ॥ ౧౦ నాడు తా॥ జహీరాబాదులోని పెద్దయెక్కళ్లిలో సోలాపురము సోమయ్యస్వామిగారు ఇదేగ్రామములో శ్రీ పద్మశాలియ యువజనసంఘము స్థాపించబడినది.

అద్దూనూరు (తాలూకా మహబూబాదు) జిల్లాషాబాద)లో పద్మశాలి యువజన సంఘస్థాపనము సోలాపురము సోమయ్యగారిచే కావించబడెను,





# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only Popular Paper That reaches The masses In the Dominions. Best Medium for Advertisement

**Volume 16** | **Hyderabad-Dn** | **Thursday 24th July 1941** | **Number 24**


## సింధురాష్ట్రమునకు మొదటశత్రుభయము

యుద్ధభయమునుగూర్చి గ్రిఫిత్ గారి ఉపన్యాసము

కరాచీనగరంలో ఖాలిక్ దీనాహాలులో జులై ౧౭ వతేదీన సింధుగవర్నరు గారి అధ్యక్షతలో ఉపన్యసించుచు శాసనసభా సభ్యుడగు గ్రిఫిత్ గారు బ్రిటిషుమిత్రమండలిపక్షము జయించిననే భారతదేశము సుఖమును నిల్పుకొనగలదు కాబట్టి ఇది భారతదేశమునకు ముఖ్యమైన యుద్ధమనిరి అందులో సింధురాష్ట్రముపై మొదటశత్రువుసులభముగా దాడిగలదు కావున ఇది సింధురాష్ట్రమునకు ముఖ్యమైనయుద్ధమనిరి గ్రిఫిత్ గారు చెప్పిరి. భారతదేశము ఒకదేశముగా నిలచియుండవలెనన్నచో ఇప్పటియుద్ధము భారతదేశానికి ముఖ్యమైనదని తలచవలెనని వారు చెప్పిరి

భారతదేశానికి ఈ యుద్ధము ముఖ్యముకాదనువారు మూడుకారణములు చెప్పుచున్నారు

౧, ఈయుద్ధము భారతదేశమునకు చాలదూరమునందున్నది, ౨-భారతదేశములో జర్మనీకి ఆసక్తిలేదు ౩ జర్మను జయించినను ప్రభువులమార్పే గాని క్రొత్తగావచ్చే కష్టమేదీ లేదు. ఈమాటలు నిజముకావని గ్రిఫిత్ గారు నిరూపించిరి.

ఈకాలపుయుద్ధమునందు దూరము దగ్గర అని భేదము చూపలేమని గ్రిఫిత్ గారనిరి. ౧౮ మాసాలక్రింద ఇప్పటియుద్ధము భారతదేశమునకు ౫౦౦౦ మైళ్ళదూరములోనుండెను- ఇప్పుడు రెండువేల మైళ్ళదూరమునమాత్రమే ఉన్నది అనగా ఒకసంవత్సరములో ౩౦౦౦ మైళ్ళదూరపుప్రదేశముయొక్క శత్రువునకుగల అవకాశము నశించిపోయినది రెండవ దురభిప్రాయమును ఖండించుచు గ్రిఫిత్ గారు జర్మనీలు తాము జీవించుటకు చాలినంతచోటును, తమపరిశ్రమలకు అవసరమైనముడిపదార్థములను మితిలేకుండ కోరుచున్నారనియు, భారతదేశము ముడిపదార్థములను ఉత్పత్తిచేయుదేశముకదాయనియు గ్రిఫిత్ గారు చెప్పిరి. మూడవఅంశమునుగురించిచెప్పుచు భారతదేశమునందు రాష్ట్రీయస్వాతంత్ర్యవ్యవస్థాపనందు ప్రజలకు ప్రభుత్వముమీదనేగాక, శాసనసభానములపైకూడ అధికారముగలదనియు, ఇటువంటి అధికారస్వాతంత్ర్యము నాజీపరిపాలనలోని ప్రజలకున్నదాయనియు గ్రిఫిత్ గారడిగిరి. కాబట్టి ఇన్నిగతులనుబట్టి భారతదేశము ఈ యుద్ధమందు ఏమీపట్టించుకోకుండ ఉండజాలదని గ్రిఫిత్ గారు చెప్పిరి.

## పాకీస్థానోద్యమ ప్రతిఘటనము

కే. యం, మున్షీ గారి ఉద్యమానికి సర్ మీర్జా ఇస్మాయిల్ గారి సుముఖత

కన్యాలాల్ మున్షీగారు ఇటీవల పాకీస్థానోద్యమప్రతిఘటనకై 'అఖండహిందూస్థాన్ ఫ్రంట్' అనుసంస్థను ఏర్పాటుచేయదలచిరిగదా ఈ యత్నానికి సహాయపడగలమని వివిధకులాలవారు ది ౨౦౦కంటెఎక్కువమంది ప్రసిద్ధభారతీయులు మున్షీ గారికి తెలియబరచిరి వారలలో ఇటీవలనే మైసూరుదివానుపదవికి రాజీనామానిచ్చిన సర్ మీర్జాఇస్మాయిల్ గారును, పంజాబులో సిక్కుకులఘుల నాయకుడగు మాస్టర్ తారాసింగ్ గారును, క్రైస్తవ శాఖపువ మదరాసునుండి డాక్టర్ జాన్ గారును, యం. యస్ అనీ, టి. ఆర్. వెంకటరామశాస్త్రి గారలు మున్నగువారలు ముఖ్యులు. అన్నితెగలవారలనుచేరుటకై అసంస్థపేరును 'యునైటెడ్ ఇండియాలీగ్' అనిపెట్టుటమంచిదని సర్ మీర్జాఇస్మాయిల్ గారు మున్షీ గారికి వ్రాసిరి. ఈ పెద్దలలో అనేకులు మున్షీ గారికి తెల్పినదేమనగా, ఏపక్షమునకుచెందనివారల సభ స్థానాలలోజరిగిన వెంటనే బొంబాయిలో పాకీస్థానోద్యమప్రతిఘటనమునుగూర్చి ఆలోచించు నొకటి సామాన్యమైన సమావేశమొకదానిని జరిపించుటమంచిదని వారు,

హిందూముసల్మానులు ఐకమత్యముకలిగియుండవలెనను విశ్వాసముగల ఇరువురుకాంగ్రెసు ముసల్మానులుమాత్రము మున్షీ గారియత్నము అనవసరమనియు, ఎందుకనగా పాకీస్థానోద్యమము కాంగ్రెసే గట్టిగా ప్రతిఘటించుచున్నదనియు చెప్పిరి. వారలలో ఒకరు అలీబహాద్దర్ ఖాన్ గారును "బొంబాయిక్రానికల్" పత్రిక సంపాదకుడగు యస్. ఎ. బ్రెల్వీగారును ఉన్నారు-

## రాజ్యాంగ సంస్కరణలు మాకువద్దు

హైదరాబాదు (దక్కన్), షహరేవరు ౧౬-

మహారాష్ట్రసభవారి కార్యకారిణీసభవారు కొన్నితీర్మానాలుచేసినారు ప్రచారకుల నియమించుటకుతీర్మానించినారు. వెట్టిచాకిరి ఎంతవరకున్నదో విచారించుచున్నారు. మంబ్యాడాలో పన్నుఅయిబ్బందు లెంతవరకున్నవో విచారింప ఒకఉపసంఘాన్ని నియమించినారు. కోల్హాపూరువిషయంలో ప్రభుత్వం మౌనంవహించినదెందుకోఅని ఆశ్చర్యపడినారు తుదిలో రానున్న రాజ్యాంగసంస్కరణములు తృప్తికరముగాలేవనియు వాటితోగమకు జోక్యముండనేరదనియు తీర్మానించినారు

### జీవరక్ష

౧౯౪౧-౭-౧౯

తిర్మల్ గిరిలాలుబజారులో కొన్నిసంవత్సరములనుండి సాత్వికపూజజరుగుచుండెను-గతరెండు సంవత్సరములనుండి పోతులు, మేకలు గొర్రెలు మొదలైనపశువులను అమ్మవారిపేర బలిఆరంభించినందున జీవరక్షాజ్ఞానప్రచారకమండలివారు అక్కడిమహాశయులగు పోద్దుటూరుచంద్రయ్య పెద్దరాజయ్య ఎం విగుప్త గారు కుశాల్ చంద్ ధర్మచంద్, శర్మగారు మొదలగువారల దరితో ప్రార్థేయపడి ఈసంవత్సరము సాత్వికపూజ జరిపి మూగపశువుల ప్రాణములురక్షించి యెల్లప్పుడు సాత్వికపూజ జరుపగలరని ప్రార్థిస్తున్నాము

## ఇంగ్లీషుపంతులు కావలెను

ప్రొద్దున రాత్రి విద్యార్థులను విచారించుకొనుపంతులుకావలెను. విద్యార్థులతోగూడా నివాసంచేయవలెను. ఆతడు స్కూలుటీచరుగాఉండవలెను. స్కూలుటీచరుగాపనిచేసుకొంటూ మిశాశాలములో విద్యార్థుల నిగరానీచేయవలెను జీతం—వివరాలకు

C/o గోలకొండ పత్రిక.

## మ. మ. వ. ప్రభువుగారి జన్మ దినము

మ ఘ వ. నిజాంప్రభువుగారి జన్మదినోత్సవం ౨౮-జూలైవాడు జరుగును కానిఆనాడు గత సంవత్సరంలోవలెనే మిలిటిరీపరేడుజరుగదు.

### ౧౦౦౦౦ రూ. దానము

హైదరాబాదు-దక్కన్, షహరేవరు ౧౬-

హైదరాబాదునగరం ఫీల్ఖానాలో నివసించుచున్న డాక్టర్ రంగాచారిగారు ఆంధ్రవిద్యాపీఠానికి ౧౦౦౦౦ రూపాయీలు తనబావమరది యగు కిడాంబి తాతాచారిగారి స్మారకంగా ఇచ్చినారు. దానినుండి వచ్చుఆదాయంతో ఏటేట మంచి వైద్యవిద్యార్థికి బంగారుపతకంఇచ్చుటకైకోరినారు

### రాఘవేంద్రశర్మగారు

హైదరాబాదు-దక్కన్, షహరేవరు ౧౫

రాఘవేంద్రశర్మ గారిని చాలాయేండ్లక్రిందట హైదరాబాదు ప్రభుత్వమువారు నిర్వాసము (షేర్ బదర్, బ్యానిష్) చేసియుండిరి. వారితల్లి చనిపోయినందున క్రియకర్మకై వారినితిథివాడు రానిచ్చుటకు ప్రభుత్వమువారు అనుమతించినారు

### ఉస్మానియా గౌరవబిరుదులు

హైదరాబాదు (దక్కన్), షహరేవరు ౧౬-

ఉస్మానియా విద్యాపీఠమువారు డాక్టరు బిరుదాలను నవాబ్ మెహిదీయార్జంగు బ. గారికిని డాక్టర్ రజీయుద్దీన్ గారికిని ఇయ్యనున్నారు

### మూడు మహాసభలసమ్మేళనము

హైదరాబాదు (దక్కన్), షహరేవరు ౧౬-

హైదరాబాదులోని ఆంధ్ర, మరాటీ, కన్నడీ మహాసభలను మూడింటిని కలగూరగంపగా ఏకీకరణముచేయవలెనని మహారాష్ట్ర మహాసభ చాలాప్రయత్నము చేయుచున్నారు. ఇదివరలో ఈవిషయాన్ని ఆలోచించేదానికి వైద్యాగారు త్రిభాషాసభల నాయకులను "చా" విందుచేసియుండిరి మరలగతవారము ఆదేవిధంగా తేనీటిపానమునకై తమమిత్రనాయకులనాహ్వానించియుండిరి. కాని కొందరువెళ్ళిరి. కొందరువెళ్లలేదు. విందుమాత్రము ముగిసినది. సమస్యమాత్రము పరిష్కారము కాలేదు.



### శ్రీరామునిసొత్తులు

హైదరాబాదు (దక్కన్), షహరేవరు ౧౬-

భద్రాచలరాముని బంగారుసొత్తులు ౪౦౦ తులాలవి వరంగల్ లో వేలంవేయగా ౧౨౦౧౦ రూపాయీలువచ్చినవి. ఆమొత్తాన్ని యుద్ధ ప్రణాళిక వినియోగించుచున్నారు.

### గౌలీగూడలో గుండాతనము

హైదరాబాదు (దక్కన్), షహరేవరు ౧౬-

గౌలీగూడములో కొందరు గుండాలు వివేకవర్ధనీ విద్యార్థులను, పంతుళ్ళను కొట్టినారని కొత్వాలు గారికి హిందూ ప్రజామండలి కార్యదర్శి గారు మొరపెట్టుకొన్నారు.

### జరీదాకై మొరలు

హైదరాబాదు (దక్కన్), షహరేవరు ౧౬-

హైదరాబాదులోని కొన్ని పత్రికలకు జరీదా అను ఉచితంగా ప్రభుత్వంవారిచ్చుచుండిరి. ఆదానాన్ని ఇప్పుడుఆపివేసినారు. అందుపైన నష్టపడినపత్రికలవారున్నూ పత్రికా సంఘమువారున్నూ ఆందోళనపడుచు హైదరాబాదులోని "అన్ని" పత్రికలకున్నూ జరీదాను అనుగ్రహించండిఅని తీర్మానించినారు.

### సర్ సుల్తాన్ అహమ్మద్ గారు

క్రొత్తగా ఏర్పాటుచేసే భారతప్రభుత్వమునందు న్యాయశాఖమంత్రిగా నియోగించబడనున్న సర్ సుల్తాన్ అహమ్మద్ గారు సెప్టెంబరు ౧వ తేదీన ఆఅధికారమును స్వీకరించగలరు.












Printed and Published by, G Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn Editor S Prathapa Reddy